రామకృష్ణమాచార్యులు, ధర్మవరం,
1853-1912

# ఆంధ్రనాటకములలోని యుత్తరరరంగములు

చెన్నపురి, 1906

Record no. 172

Rāmakṛṣṇamācāryulu,
Dharmavaraṃ, 1853-1912

Āṃdhranāṭakamulalōni
yuttararaṅgamulu

Cennapuri, 1906

Record no. 172

## Bibliographic Record Target

రామకృష్ణమాచార్యులు, ధర్మవరం, 1853-1912.
ఆంధ్రనాటకములలోని యుత్తరరంగములు / ఇది ధర్మవరం రామకృష్ణమాచార్యులచే రచియింపఁబడినది. - చెన్నపురి : వి. వేం. సుబ్బరామయ్యశెట్టి, 1906.
vi, (1), 76, (1) p. :ports. ;13 cm.
Record no. 172

Rāmakṛṣṇamācāryulu, Dharmavaraṃ, 1853-1912.
Āṃdhranāṭakamulalōni yuttararaṅgamulu / idi Dharmavaraṃ Rāmakṛṣṇamācāryulacē raciyimpam̐baḍinadi. - Cennapuri : Vi. Vēṃ. Subbarāmayyaśeṭṭi, 1906.
vi, (1), 76, (1) p. :ports. ;13 cm.
Record no. 172

# Epilogues

## of Telugu Drama

CONTAINING



Prameelarjuna
Vishada Sarangadhara
Savithree Chitraswa
Abhignana Manimanta
Opendra Vijaya
Chirakari
Brihannala
Chitra Naleeya
Svapnaniruddha
Madanavilasa and
Mooka Chikichchaka
Prahasanam

By D. Krishnama Charlu,
First Grade Pleader, Bellary.

[Price As. 4.]

From The Madras Law Journal Office,
Post Box 604, Mylapore, MADRAS.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

ఆంధ్రనాటకములలోని

# యుత్తరరంగములు

ఇది

శతావధానం

ధర్మవరం-రామకృష్ణమాచార్యులుగారిచే

రచియింపఁబడి

మదరాసు కోపు-వెంకటాచలయ్యా వీధిలోనుండు

విడుమలపాటి సుబ్బరామయ్యా శెట్టిగారి

కోరికవలన

వారి తమ్ములైన

వి. వేం. సుబ్బరామయ్యా శెట్టిగారిచే

ప్రచురింపఁబడియె.

చెన్నపురి:

గ్రంధి - రామస్వామిశెట్టి అండ్ కంపెనీవారి

ముద్రాక్షరశాలను ముద్రితము.




1.12-0

# పీఠిక.

ఈ గ్రంథము నాదిపత్రమున రెండు రూపపటము లగపడుచున్నవి. అందులో మొదటిది గ్రంథకర్తగారైన ధర్మవరము - రామకృష్ణమాచార్యులవారి పటము సరియేకదా. ఆ రెండవ రూపపటమిందుఁబొందింపఁబడుటకుఁ గారణము చెప్పవలసియున్నది. వారు మా యన్నగారగు విడుమలపాటి-సుబ్బరామయ్య సెట్టిగారు. వారు శ్రీరామకృష్ణమాచార్యులవారి మిత్రులు. ఆచార్యులవారు చెన్నపురికి వచ్చినప్పుడెల్ల బంధువులసయితముమాని మాయింటనే నిలుచు ప్రేమఁ జూపుచుండురు. వారొనర్చిన బహునాటకములలోఁ జిత్రనళీయముమాత్రమచ్చొత్తింపఁబడియున్నది. మిగిలిన యిరువది నాటకములలో నిదివఱకు నొక్కటియయిన ముద్రిం

పించినవారుగారు. ఇతరులకుఁ బ్రతుల వ్రాసికొనుటకైన వాని నొసఁగుట కష్టము. అయిన వారి నాటకములలో విశేషభాగము ప్రతులు మాయింటనున్నవని చెప్పుటవలన మాయన్న గారియెడ వారి విశ్వాసము తెలియనగు. ఇట్లుండియు మా యన్నగారెన్నిమారు లెంత ప్రేరేపించినను నాటకముల ముద్రింపించినవారుగారు. అటు ముద్రింపకుండుట యాంధ్ర భాషాభిమానులకు వారపకార మొనర్చుటగా భావింపఁ దగియున్నదని సయితము మా యన్నగారు నుడువుచువచ్చిరి. ఐనను నేదియో కారణము చెప్పుచువచ్చిరిగాని నాటకములఁ బ్రకటించినవారుకారు. వారి నాటకములన్నియు బహు ధర్మబోధకములును నున్నత నీతిప్రదములునుగా నున్నవి. వానిలోఁ బెక్కు నాటకములతుద నుత్తరరంగములు విశేష



భాగము ద్విపదగా నాయా నాటకముల నున్న నీతులు వచింపుచు వచ్చినారు. వారాదిపెట్టిన పద్ధతినే యిప్పటి కొందఱు నాటకకర్తలవలంబించియున్నారు. ఆ నీతులు స్వభావముచేతనే శ్రవణానందము గలిగింపఁగలయవి. వానినైనఁ బ్రచురించి జనోపయోగము గలిగించు కుతూహలమున మాయన్నగారాచార్యులవారి యనుమతితో నాఫలస్తుతులనెల్ల నిప్పటికి రెండు సంవత్సరముల క్రిందటనే సంగ్రహించిరి. ఆచార్యులవారి జీవచరిత్ర వ్రాయునుద్దేశమున వారితో సంభాషించినప్పుడు విషయములవిశేష భాగము సంగ్రహించిరి. వారి జీవచరిత్రతో నీయుత్తరరంగములు చేర్చి ముద్రింపవలయునని వారి కభిలాషయుండినది. ఇంతలో నిప్పటికిఁ దొమ్మిదిమాసముల క్రిందట మాయన్నగారు పరమపదముఁ జెందిరి. వారుద్దేశించి యుండిన

కార్యము సాంతముం గావింపవలయునని నాకుఁ గోరిక గలిగె. కాని జీవచరిత్ర వ్రాయుటకు నాలస్యమగుట కోర్వక నాటకోత్తరరంగముల మాత్ర మిందుఁ బ్రచురించితి. ఇది యీ యుత్తరరంగ ముద్రణమునకుఁ గారణము:

"కర్తా కారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః ।
........................ చత్వారస్సమభాగినః"

అని యున్న లోకోక్తికి లక్ష్యభూతముగా కర్త యొక్కయుఁ బ్రేరకునియొక్కయు రూపపటముల నిందుఁ బొందించియున్నాఁడ.

వి. వేం. సుబ్బరామయ్యసెట్టి.

చెన్నపురి,
1906 సం॥ ఏప్రయల్ నెల 15 తేది.

# విషయసూచిక.



# THE EPILOGUE

OF

# PRAMEELARJUNAM.

---

## ప్రమీలార్జున నాటకము యొక్క-
## యుత్తరరంగము.

---

సీ. సతులకించుకయైన స్వాతంత్ర్యమిచ్చుట
తరముగాదనుపుణ్య పురుషులార
స్త్రీలకు విద్యనేర్పించిన లోకముల్
మునుఁగునంచనుధీర మనుజులార

పాటింపఁగూడ దెచ్చోటఁ గాంతలబుద్ధి
ప్రళయాంతకం బను భవ్యులార
సుతులఁగాంచుటకంటె సతులకు నింకొక్క
పనిలేద నెడు మహా ప్రభువులార

తే-గీ. ఆలకించితిరే ప్రమీ లార్జునంబు
నరసితిరె వీరు పురుషుల నాడుభంగి
యెంచిచూడంగ నాశ్చర్య మేమికలదు
బలముగలవారె యెయ్యెడఁ బ్రభులుగారె.

ఉ. మానవతీలలామ మగ
మానిసితోడు వహింపకుజ్వలం
బైన మహావనిక్ జతురు
పాయ ధురీణత నేలి సర్వది
జ్ఞానిత వైభవంబునస
మానబలంబును గన్న యీ ప్రమీ
లా నళినాయతాక్షికి ని
లక్ సము లెవ్వరు కీర్తినంపదక్.



సీ. అనిలోన నరకాసు రుని డీలుపడఁజేయఁ
బరఁగిన యొక సత్యభామగలదె
పతికి సారథ్యంబు వఱపి యాదవసేన
బడలించు నొక్క సుభద్రగలదె
అరిసతుల్వైధవలౌనం దాఁక ముడిఁగట్టఁ
జాలని యొక్క పాంచాలిగలదె
రాజ్యధోరణియెల్ల రాజులు భళియన
నేలెదు నొక్క ప్రమీలగలదె

ఆ-వె. కలుగరైరె భరత ఖండంబునను మున్ను
ధీరసతులు విమల భూరియశలు
ఇప్పుడట్టివార లెందైననున్నారె
లేరు లేరు లేరు లేరు లేరు.

సీ. మున్నటివారేల కన్నారఁగనమె నేఁ
డున్నవారుల వారి నెన్న వలదె
చక్రవర్తిని నా విశాల ధారుణినేలి
క్రాలు విక్టోరియా రాణిలేదె

పాండిత్య పరిణతితో షన్యాసములనించి
జగమెన్న నానిబె పాంటులేదె
విమలకావ్యంబుల నమృతంబు గురియించు
జేనాష్టినను మంద యానలేదె

తే-గీ. ఊయిడాదులదెందతో యుండలేదె
పశ్చిమధరాతలంబున భరతఖండ
మున నొకర్తుక యట్టి బల్వనితకలదె
కటకటాయిట్టి దశకేమి కారణంబు.

సీ. తనకన్నబిడ్డల కనువార విమల వి
ద్యావినీతుల నేర్పు తల్లియేది
పితరులు గౌరవ స్థితిఁగాంచఁగలిగిన
విజ్ఞానధన్యయా బిడ్డయేది
గోడువెట్టక తన కోడలికిని ధీర
చిత్తంబు గలిగించు నత్తయేది
పారకచేటలఁగాక పారినత్తమామల
గురుబుద్ధిఁదనియించు కోడలేది



తే-గీ. వరసుధీగరిమంబున వన్నెనెక్కి
తనమగనిఁ దప్పుత్రోవలఁ దగులకుండ
నంకుశంబుగ గృహకార్యయాత్రలెల్ల
భారమువహించి వెలయించు భార్యయేది.

క. ఏరాజ్యంబునఁ దరుణులు
దారకళాకుశల సుస్వతంత్రలుగలరో
యారాజ్యంబునఁ బురుషులు
ధీరులునధికారు లమల ధీసువిచారుల్.

క. ఏరాజ్యంబునఁజెలులవి
చారలు పరతంత్రలస్త సత్వలుగలరో
యారాజ్యము పురుషులనా
ధారులునవిచారుల స్వతంత్రవిహారుల్.

సీ. అన్వర్థముగఁగాంత యబల కావునదయో
జ్వలసమత్వమునింప వలయునుండి
పుత్రులకిలమాత్ర బుద్ధిపొల్పడుఁగాన
లలన విద్యలనేర్వ వలయునుండి

# THE EPILOGUE OF THE VISHADA SARANGADHARA NATAKA.

## THE ADVISE OF RAJANARENDRA TO HUMANITY.

## విషాదసారంగధర నాటకముయొక్క యుత్తరరంగము.

### రాజనరేంద్రు నుపదేశము.

ద్వి. నాచరిత్రంబుమ నంబుననరయ
వైచిత్రియింతని వాకొనఁదరమె
యింతిమాటలనమ్మి "ఇదమిత్థ" మంచుఁ
జింతింపఁజాలక సిలుగులఁబడితి
నాతురతనునిక్క మరయకపోతిఁ
బ్రీతియొల్లనుమాని పెంపుగోల్పడితి
తప్పకయిదికల్ల తగదంచుహితము
చెప్పువారలమాటఁ జెవిఁబెట్టనైతి



నామానినీమణి నామోహనాంగి
నాముద్దువగలాడి నాపూవుఁబోఁడి
చెల్లఁబోయెందైనఁ జిత్రాంగి తెలిసి
కల్లలాడునెయంచుఁ గడునమ్మిచెడితి
ననయంబునన్నుమ హోదరబుద్ధిఁ
దనదైవమని ప్రేమ దైవారఁబలికె
నామాటయించుకైన నుఁజవదాఁట
కేమారకాలించి యేవేళనడిపె
ఒకనాడు నేఁదన యొద్దలేకున్న
నొకవత్సరంబాయె నోనాఁగఁజేసె
వేఁటకైవనికి నే వెడలెదనన్నఁ
బాటింపకెంతయు వగఁజెందికుంది
వినకానవెట్టినీ వెంట నేవత్తు
ననిపల్కివిశ్వాస మలరంగఁజేసె
దీనికైకాదయు దీర్ఘవైరమున
మేనెఱుంగనిరీతి మెఱయురోషమున
నంధతవెలయంగ నక్కటాప్రాణ

బంధుత్వమింతైనఁ బాటింపనైతి
దీనికైకాదయే త్త్రైలఁబట్టుపట్టి
జ్ఞానాఢ్యులైనట్టి సచివులుసఖులు
నీతియుకల్లయుం చెంతచెప్పినను
నీతిమార్గమునింత నిలుపకపోతి
దీనికైకాదయె త్తినరోషభరము
మానకదీనవైయె మదిఁదాళలేక
కరుణించిపుత్రభిక్షంబిమ్మటంచు
నరుదారువేదనం బడరంగమిగులఁ
గటకటపడితన కరుణంపుభంగి
కటికిమానసమైనఁ గరుగంగవేడు
రంగారుకులసతి రత్నాంగిదేవి
యంగనామణిమాట లటుత్రోసివైచి
యంతనిష్ఠురములై యడరువాక్యముల
స్వాంతంబుఁదూలించి పాపంబునించి
చింతలఁబెంచిదు స్థితిముంచిమించి
యంతమొందఁగఁజేయ నకటపాల్పడితి



దీనికైకాదనా తేజోధనంబు
నానోముఫలంబు నానిధానంబు
నాకూర్మిచుట్టంబు నాచెలికాఁడు
నాకుమారుండిటు ననుఁబాసిపోవ
శోకాగ్నిదహియింప సుకుమారుఁజూడ
వేకారిదరిఁజేరు విధిఁగానలేక
పగలొందికుందెనె వ్వగఁజెందికంది
జగతిదుఃఖపుచావు చావలోనైతి
తానెమోహముగూరి తనయునిఁగోరి
మానకబతిమాలి మరులునదూలి
వలవంతదగదొట్టి బలవంతపెట్టి
వలదనిపోవంగ వాసితొలంగ
బూటకంబులఁగూర్చి బుద్ధిపోకార్చి
నీటిమాటలఁగట్టి నెమ్మిపోఁగొట్టి
లేనిమాటలుబచ్చి లీలలఁగుచ్చి
వానిరూపముఁబాపి పరిణతిమాపి
భీమపాపముగట్టి పేరుఁబోఁగొట్టి

తామసంబునరోసి తలకంగఁజేసి 60
హీనదోషముపెట్టి యెఱుకపోఁదట్టి
దీనునిగావించి ధృతిఁబోనడంచి
కడిమిఁదూలించిదుఃఖములసోలించి
యడఁగించియుడికించి యకటచంపించె 64
నింతటిజగజంత యింతటిదిట్ట
యింతటిగయ్యాళి యింతటిజాగ
యింతటిదుర్జాతి యింతటిపలువ
యింతటిపలుగాకి యెందైనఁగలదె 68
యీమారియీఘాత యీపిశాచంబు
ఈమృత్యుదేవత యీమాయలాడి
మధురవాక్యమెవేద మంత్రంబుగాఁగ
విధవిధంబులనమ్మి వీటిడినైతి 72
కులముద్ధరించెడు కొమరుఁడే,జ్ఞాన
బలసముగ్రుండగు పట్టియే,ధీర
వారభూషణుఁడగు పాపఁడే,యత్య
దారగుణుండగు తనయుఁడే,యంచు 76



నించుకంతయుగణి యించఁగాలేక
సంచలించితపించి సడలించిమించి
చాలఁగోపించిమీ సరముదూలించి
కేలుకాలిటునటి కించితిఁగాదె 80
ధీరగుణముబూని తివిరికొన్నాళ్ల
కారాగృహంబునఁ గడిమిమైనుంచి
పిదపవిచారించు విధమైననింత
మదిఁదోఁపదాయెనె స్మృదిగల్గదాయె 84
చెలఁగిసమ్మతిబాసెఁ జీఁకటిమూసె
విలయంబుడాసె వివేకంబుమాసె
పాయకయీబలు బన్నముల్దెచ్చి
నాయాతురతయెగా నన్నింతచేసె 88
త్వరయదికలుషంబు త్వరయదికీడు
త్వరయువిరోధంబు త్వరయదిచేటు
దీపితక్షాంతిప్ర దీపమాతురత
పాపపుంజములకు భవనమాతురత 92
దుష్కార్యములకెల్లఁ ద్రోవయాతురత

నిష్కారణకువాస నిలయమాతురత
ముఖ్యబంధుద్వేష మూలమాతురత
సఖ్యనాశనరాజ సరణియాతురత 96
కార్యభంగమునకు గవినియాతురత
ధైర్యాబ్ధిబాడబో త్పాతమాతురత
ధరణి నెన్నఁడుగాని తలపోసిచూడ
గురుతరాతురబుద్ధి కొఱగాదుసుండి 100
చెలులారపల్లవ శ్రీపాణులార
కలవాణులారయో ఘనవేణులార
కలికిచిత్రాంగియీ కలుషంబుచేయ
నిలఁగారణంబది యేమున్నయదియొ 104
దానినూహింపుఁడు తరళాక్షులార
మీ నెమ్మనంబుల మిగులయోచించి
చనదుర్మతంబది జన్యంబుదాని
కనిచెప్పఁబోయెద రదిగాదుసుండి 108
వనితప్రారబ్ధంబు భంగియిట్లుండె
ననిచెప్పఁబోయెద రదిగాదుసుండి



మునుమున్నెయాతని మోహించియుండె
ననిచెప్పఁబోయెద రదిగాదుసుండి 112
అదియుఁగాదిదియుఁగా దన్ననెట్లన్న
మదిరాక్షులారనా మాటవినుండు
ఈడుగానివివాహ మిదికారణంబు
జోడుచాలనిపెండ్లి శుద్ధాపరాధ 116
మిదిగాకవేఱొక్క టేదికారణము
పదునాలుగేడయేఁ బదియేఁడులేడ
పడఁతిరూపముఁజూచి భ్రమసితిఁగాక
యెఱుగలైదునంచు నెఱుఁగకపోతి 120
ధారుణిలోనిట్లు తనరుపెండిండ్ల
మీరలెఱుంగరే మృగనేత్రలార
ఒకవత్సరంబేమి యొగిరెండునేమి
ప్రకటించిబాలకుఁ బరగింత్రుపెండ్లి 124
ధనమొండుమాత్రంబు దనరినఁజాలు
నొనరనింకొకమాట యోచించువారె
ముదుసలియగుఁగాక మూర్ఖుఁడౌఁగాక

యదయాత్ముఁడగుఁగాక యబలుఁడౌఁగాక
బాలిశుండగుఁగాక పలువయౌఁగాక
గోలయౌఁగాక పెన్గూళయౌఁగాక
యర్భకుండగుఁగాక యనదయౌఁగాక
దుర్భగుండగుఁగాక దోషియౌఁగాక
జాత్యంధుఁడగుఁగాక శ్వపచుఁడౌఁగాక
వ్రాత్యుండెయగుఁగాక బధిరుఁడౌఁగాక
కుంటివాఁడగుఁగాక క్రూరుఁడౌఁగాక
తుంటరియగుఁగాక తుందియౌఁగాక
ఎట్టివాఁడైన ధనేచ్ఛ చేసుతలఁ
గట్టిడితనమునఁ గట్టెదరకట
ఘనధారుణీశులు కప్పముల్గట్టఁ
ప్రణుతగౌరవమున రాజసైవిభవ
గతిమీఱియున్ననా గతియిట్టులైన
నితరులమాటయిం కేలయోచింప
ఓడకాడెదనింక నోచెలులార
యీడుగానివివాహ మెందునుదగదు.

# THE EPILOGUE OF SAVITHREE CHITRASWA NATAKA.

## సావిత్రీచిత్రాశ్వ నాటకముయొక్క యుత్తరరంగము.

ద్వి. శ్రీలలితంబునీ చిత్రాశ్వచరిత
మాలకించితిరెపు ణ్యాంగనలార
చెలులారపల్లవ శ్రీపాణులార
కలవాణులారయో ఘనవేణులార
సుమజాలకోమల సురుచిరగాత్రి
సమవేతపాపనం చయకాళరాత్రి
పాలితచింతిత ఫలదాగ్నిహోత్రి
శీలక్షమాగుణాం చితభూతధాత్రి
రాజితజలజాత రమణీయనేత్ర
రాజవందితమద్ర రాజసత్పుత్రి

యలఘుచారిత్రయీ యమలసావిత్రి
కులసతీమణులకు గురుభూతగాదె
శ్రీతుంగబహుమహా జితభానుమంతు
శీతలముఖకళా జితనిశాకాంతు
రుచిరరూపజయంతు రుచిచయానంతు
నచలశుద్ధస్వాంతు నాసత్యవంతుఁ
గానలోఁగనినాఁడు కమలాక్షితనదు
ప్రాణనాథునిఁగాఁగ భావించెనంత
నాసత్యవంతుఁడీ యవనిరాజ్యంబుఁ
బాసియరణ్యంబుఁ బట్టుటవినినఁ
దల్లిగాదనెఁదన తండ్రివల్దనియె
నల్లనారదమౌని యాశ్చర్యపడియెఁ
బరిణయంబైనసం వత్సరంబునకు
వరుఁడుమృతుండగు వాఁడంచువినియె
నత్తయుమామయు నంధులై కాన
నత్తటిమునివృత్తు లైయుండుటరసె
గహనమేయిల్లుగాఁ గలుగుట నెఱిఁగె



నహహాతానెంతటి యచలమానసయొ
వెలఁదితామదిలోన వేఱొక్కమనుజుఁ
దలపోయదాయెనిం తటివారుగలరె
మగువయిట్టులదృఢ మానసయగుచు
నగణితగతిఁబెండ్లి యాడెఁజిత్రాశ్వుఁ
దనమక్కువపుఁదల్లి దండ్రులకంటె
ఘనముగాఁజూచుచుఁ గడుభక్తిమెఱయ
నత్తమామలకుమ హాప్రేమతోడ
నుత్తమశుశ్రూష లొగిఁజేసివెలసె
నరుదారఁగానలో నాకలంబులనె
పరమామృతముగాఁగ భావించియలరెఁ
దనమగఁడన్నను దైవంబుబోలెఁ
గనుఁగొనిపరిచర్యఁ గావింపఁగనియె
వనజాక్షితననాథుఁ బాయకయుండి
తనదుపతివ్రతా ధర్మంబుపేర్మిఁ
గలిగినమాహాత్మ్య గరిమంబుఁజేసి
యలఘులీలలఁగాల యమువాఁతఁబడిన

తననాథుప్్రాణముల్ దాఁదెచ్చుకొనియె
ననుపమఖ్యాతియి య్యవనినిండార
పల్లవాధరయంక పాళిశయించి
వల్లభుఁడుండంగ వానిఁబట్టంగ
సముదీర్ణబహుభీమ సత్వాఢ్యులైన
యమదూతలే తెంచి యటు చేరలేక
దిగులొంది వెనుకకుఁ దిరుగుటయెల్ల
మగువపతివ్రతా మహిమంబుగాదె
చటులదుస్తరతప శ్శక్తిచేనైనఁ
బటునియమాంచిత భక్తిచేనైన
ఘనతరబహుయోగ గరిమలనైనఁ
గనుఁగొనఁగారాని కాలుండువచ్చి
యగణితరీతిఁ బ్రత్యక్షమౌటెల్ల
మగువపతివ్రతా మహిమంబుగాదె
అరుదారనాథుని బ్రాణముల్ గొంచు
నరిగెడుయముపెంట నంటి దుర్గమము
లైనసీమలఁజేర నలవడుటెల్ల



మానకకాలుని మదికెక్కుటెల్ల
వైతరణీనది వడిదాటుటెల్ల
ఖ్యాతిశ్యామాదేవిఁ గనుఁగొనుటెల్ల
నత్తమామలకన్ను లలరుటయెల్ల
నుత్తమరాజ్యంబు సొగిఁబొందుటెల్లఁ
దండ్రికిఁబుత్రసంతతిగల్గుటెల్ల
వేండ్రమౌవైధవ్య విధితీఱుటెల్లఁ
దగురీతిశమనుండు దయచేయుటెల్ల
మగువపతివ్రతా మహిమంబుగాదె
జలజాక్షులారయీ సావిత్రివలనఁ
దెలుపంగఁబడినప తివ్రతాధర్మ
విసరంబులెల్లను వింటిరిగాదె
మసలివానినిమీరు మఱువంగరాదు
చిగురాకుబోణియం చితభక్తితోడ
మగఁడెదైవంబుగా మదినెంచవలయు
నతనిబంధులనెల్లఁ బ్రాణబంధువుల
గతినాదరంబునఁ గనుఁగొనవలయు

వేదమంత్రముబోలె విలసిల్లుభక్తిఁ
బైఁదలిపతిమాట పాటింపవలయుఁ 80
గరుణించివిభుఁడొసఁగఁగనెద్దియైనఁ
బరమామృతముగాఁగ భావింపవలయు
నేవేళఁబ్రాణేశు నీప్సితంబెఱిఁగి
సేవలుభక్తిమైఁ జేయంగవలయు 84
నుడురాజముఖినాథుఁ డొద్దలేకున్నఁ
గడునలంకారముల్ గయిసేయరాదు
కులటలతోఁజెల్మిఁ గూడంగరాదు
చెలువునిహాస్యంబు సేయంగరాదు 88
ఏపారఁగానెందు నెదురాడరాదు
కోపించెననిమదిఁ గుందఁగారాదు
సమ్మతింపనిపనుల్ సలుపఁగారాదు
సొమ్ములివ్వఁడటంచు సొలయఁగారాదు 92
(అంగనామణిసొమ్ము లన్నియు నొక్క-
మంగళసూత్రంబు మహిమకుసమమె)
గుఱుతుగానీధర్మ కుశలతగల్గు



తెఱవపతివ్రతా తిలకంబుగాదె 96
పతిభక్తియొక్కటి బలముగాఁగల్గు
సతికినెందైనన సాధ్యంబుగలదె
యింతికిఁబతిభక్తి యిష్టదాయకము
కాంతకుఁబతిభక్తి కలుషశోషణము 100
భామకుఁబతిభక్తి బహుజన్మఫలము
రామకుఁబతిభక్తి రత్నభూషణము
కలికికిఁబతిభక్తి కామితదాయి
వెలఁదికిఁబతిభక్తి వెలలేనిసొమ్ము 104
మెలఁతకుఁబతిభక్తి మేల్నిధానంబు
నెలఁతకుఁబతిభక్తి నిక్కంపుమాట
పతిభక్తిరమణికిఁ బాపనాశనము
పతిభక్తితరుణికి ఫలదాయకంబు 108
పతిభక్తియువతికిఁ బరమభద్రంబు
పతిభక్తిపొలఁతికిఁ బారిజాతంబు
పతిభక్తిచామకు బహుసౌఖ్యకరము
పతిభక్తిలేమకు వరముక్తిదంబు 112

పతిభక్తిచెలువకు భాగ్యసంగతము
పతిభక్తియతివకుఁ బటుయశోంచితము
వటియింపఁగానుప వాసంబులేల
యటమటింపఁగఁదీర్థ యాత్రాదులేల 116
రహిఁగాశియేలయా రాకాసియేల
బహుళయజ్ఞములేల వ్రతములవేల
ధ్యానంబులేలబల్ దానంబులేల
స్నానంబులేలప్ర స్థానంబులేల 120
బాలామణికిఁబతి భక్తియొక్కటియె
చాలదేపరికింప జన్మఫలంబు
సరిలేనియిహపర సౌఖ్యంబులెల్లఁ
బరఁగింపఁజాలెడు పతిభక్తియుండ 124
నితరవ్రతాదుల నెల్లనుమోక్ష
మతివలుపొందంగ నడరుటలెల్ల
రిత్తపోవఁగనల్ల రేఁగుబండులకు
ముత్తియంబులుపోయు మూర్ఖతగాదె 128
యల్పమేరుపర్వతం బమరంగనెక్కి



గులకరాళ్ళైరంగఁ గోరుటగాదె 132
నవనీతమంచితో న్నతిఁజేతఁగలిగి
యవనినేతికినంగ లార్చుటగాదె
కావునసతులార కల్యాణులార
యావిలమతిమాని హర్షంబుబూని
భావంబులనుబతి భక్తినిండారఁ
బావనలైయుండ వలయునుసుండి 136

# THE EPILOGUE OF THE ABHIGNANA MANIMANTA NATAKA.

## THE ADVICE OF DUSHTABUDDHI TO HUMANITY.

# అభిజ్ఞానమణిమంత నాటకముయొక్క యుత్తరరంగము.

## దుష్టబుద్ధియుపదేశము.

ద్వి. జనులార నేఁడు నా చరితంబువిన్న
ఘననీతి సంధాయకము గాదె తలఁప
ఎల్లభూముల వసియించెడు ధరణి
వల్లభుల్దనకుఁగప్పంబుల నొసఁగ
యవనతురుష్కులే యాదిగాఁగల్గు



నవనీశ్వరులు "పరా" కంచుఁబెక్కండ్రు
సామంతులైకొల్వ సరిలేని కడిమి
శ్రీమీఱ వసుమతిఁ జెలువార నేలు
నీకుంతలేశున కిరవారుమంత్రి
నైకమూర్తిసఖుఁడనై యకలంకగరిమ
సామంత ధారుణీశ్వరులు పూజింప
భూమిపై విఖ్యాతిఁ బొందినవాఁడ
"నాలోచనమున బృహస్పతి యితఁడు
పాలనంబున రమా వల్లభుండితఁడు
ధైర్యంబునను మేరు ధరనాథుఁడితఁడు
కార్యభాగమున యౌగంధరుఁడితఁడు
స్థిరతేజమునఁజూడ దిననాథుఁడితఁడు
వరవిక్రమంబునఁ బావకుండితఁడు
సాధింతుననియన్న సాధించువాఁడు
వేధింప యమునైన విడువనివాఁడు"
అని జనంబులు కొని యాడంగ జగతి
ననుపమ విఖ్యాతి నారంగఁగాంచి

"జగతీశుఁడేల యీ సచివుఁడేమాకు
జగదీశుఁడగు" నన్న సరణిఁబేర్వడితి
యవనరాజులు "హుజూ" రని పిల్చుపలుకు
లవనీశ వరునిఁగా దారయనన్నె
యిలకేని నింతైన నెఱుఁగరుకనరు
చెలఁగి యెల్లెడ "దివాన్జీ" గారటన్న
("భళిరా" యటందురు ప్రజలెల్లనన్న)
నింతటివిఖ్యాతి యింతటిగరిమ
యింతటిప్రాభవ మేరీతిఁగలిగె
సుగుణంబుననుగాదు సురుచినిగాదు
మగటిమిఁగాదు ధర్మంబునఁగాదు
భూతదయనుగాదు పుడుకునఁగాదు
ప్రీతపంబునఁగాదు హితమునఁగాదు
దాపక నాచరిత్రము వెల్లడింతు
నీపట్టునను దీని నేపారవినరె
బుద్ధివచ్చినదినంబులనుండి నేను
శుద్ధవర్తనమను జోలియెఱుంగ



నకలంకమానసం బదియెందు నెఱుఁగ
నొకరుని మేలునే నోర్చియెఱుంగ
నొరునింటఁబెండ్లిగా నున్నదటన్నఁ
దరముమీఱిన పరితాపంబుబూని
యాపెండ్లిశ్రాద్ధమా నందాఁకవగచి
వాపోయిపలవించి వడిసోలుచుందు
ఒరునకొక్కఁడుఁ బుత్త్రుఁ డుదయించెనన్న
గురుతాపమున నాదు కొమరుండునీల్గు
నదనున నెంతయు నారాటపడుచు
పదివాసరములైన వాపోవుచుందు
నెవఁడైనఁ దనద్రవ్య మేపారనిచ్చి
భవనంబుమంచిది పడసెనటన్న
నాభవనముఁగూలి నాపైనఁబడిన
యాభంగిఁదపియించి యడలునమించి
యెడదదావానలం బేర్చినపగిదిఁ
గడయెఱుంగనిరీతిఁ గడుపునమండి
చురపిల్లివడినిప్పుఁ ద్రొక్కినకోతి

కరణి నెయ్యెడనైనఁ గాలూనలేక
యాయింటి నిలఁగూల్చు నంతటిదాఁకఁ
బాయని శోకాగ్ని పాలౌచునుందు
ఇతరులెవ్వారైన నిద్దఱు మంచి
హితులన్నమాట నెక్కింతవిన్నంత
నెనలేనిక్రోధంబు హృదయంబుగలఁప
మనసునిల్పఁగలేక మాటాడలేక
వారలవిహితంబు వారించుదాఁకఁ
గూరుకు నిదురనేఁ గోరకయుందు
ఈయసూయగుణంబు నీయీర్ష్యనాకు
బాయనిదుష్టస్వభావంబులయ్యె
మిత్రుఁడైననునన్ను మిడుకంగఁగోయు
శత్రుఁడైననునాకు సముఁడె యీవిధికి
సంతోషమెఱుఁగ నిచ్చునెవ్వఁడైన
వింతశోకముజెందు వేళలఁగాని
యిట్టిగుణములుండి యింతటిఖ్యాతి
నెట్టులఁబడసితి నెఱుఁగరుగారె



మోసంబుననుగాక ముదమారనాదు
వాసిచేఁగాదు నా ప్రఖ్యాతియరయ
ఇంపార రాజ్యంబు నెనయుదురాశఁ
జంపకమాలినీ సతి నాసుతునకుఁ
బరిణయంబొనరించు భంగికినడుమ
నరుదెంచు మణిమంతు నకటచంపంగ
మంగళపురికేగి మఱియఘోరునకు
వెంగలినైద్రవ్య వితతినిచ్చితిని
చరణాంగుళముఁగోసి చలముపోఁద్రోసి
పరిసమాప్తియొనర్చిఁ బరికించిపీఁడు
దైవయత్నముగాని తలపోయమనదు
భావంబు నిష్ఫల ప్రాయంబునుండి
చందనావతికేగి చంద్రహాసాఖ్యు
నందమొందుచునున్న యాలోకవీరుఁ
గ్రూరకర్మునాక ఘోరబాణమున
వారింపఁజూచితి వానికంధరము
కుత్తుకకేసిన క్రూరనారాచ

మత్తతిఁ జెవిఁబాఁకి యదివ్యర్థమయ్యె
దైవయత్నముగాని తలపోయమనదు
భావంబు నిష్ఫల ప్రాయంబునుండి 92
పెంపతిసుతునకు విషమిచ్చివీనిఁ
జంపంగనొకకమ్మ చయ్యనవ్రాసి
పంపితినాలేఖ వానిమోహించి
సొంపుగాంచిననాదు సుతచేతఁజిక్కె 96
"విష" మనుమాట వేవేగంబచెఱిచి
"విషయ" యంచనురీతి వెలఁదిధామార్చె
"ప్రాణపీడన" మన్న పదముపోనడిచి
"పాణిపీడన" ముగా భావింపఁజేసె 100
"సన్యాస" మనుమాట నెయ్యనఁద్రిప్పి
"యుద్వాహ" మనుభంగి నెనరంగఁజేసె
నీవింతయేమన నిటుమార్చితనయ
చావుకమ్మను పెండ్లి జాబొనరించె 104
దైవయత్నముగాని తలపోయమనదు
భావంబు నిష్ఫల ప్రాయంబునుండి



ఇప్పుడేమనవచ్చు నీవిధంబెఱిఁగి
తప్పనివైరంబు దాళఁగలేక 108
కులముద్ధరించెడు కొమరుఁడే,జ్ఞాన
బలసమగ్రుండగు పాపఁడే,యత్యు
దారగుణుండగు తనయుఁడే,తనయ
నారచేపటిన యల్లుఁడే,యంచు 112
నించుకంతయుఁజూడక సుతత్రాడు
త్రెంచుటకైన నే ద్రోహ నోర్చి యకట
కాలసర్పంబులఁ గడిమిఁదెప్పించి
కాళికాలయమున గండివెట్టించి 116
మణిమంతుఁడంచు నెమ్మదిఁబొంగివిడిచి
గుణభూషణునినాదు కొమరుఁజంపితిని
దైవయత్నముగాక తలపోయమనదు
భావంబు నిష్ఫల ప్రాయంబునుండి 120
నానోములఫలంబు నానిధానంబు
నానిండుభాగ్యంబు నావంశఫలము
నాపూర్ణచంద్రుండు నాజీవదాత

నాపెన్నిధానంబు నాముద్దుకుఱ్ఱ
నాకూర్మిచుట్టంబు నాచెలికాఁడు
నాకుమారుండిటు నన్నుఁబాసిపోవ
శోకాగ్ని సహియింప సుకుమారుఁజూడ
వేళారి దరిఁజేరు విధిఁగానలేక
వగఁజెందికుంది నెవ్వగలొందికంది
జగతి దుఃఖపుచావు చావలోనైతి
నాకామితార్థంబు నకుఫలంబిదియె
నాకష్టకృత్యంబు నకు ఫలంబిదియె
నాయసూయాగుణంబు నకు ఫలంబిదియె
నాయీర్ష్య జన్మంబు నకు ఫలంబిదియె
నాదుక్రోధగుణంబు నకు ఫలంబిదియె
నాదుమాత్సర్యంబు నకు ఫలంబిదియె
ఈచేతఁజేసిన దీచేతఁగుడుచు
వైచిత్రియయ్యో నెవ్వగలింక నేల
అలయనింకేల మహాజనులార!
కలుషమెన్నఁడుగాని కమలించునుండి॥

# THE EPILOGUE OF
# UPENDRA VIJAYAM.
OR
# VAMANA CHARITRAM.

---

## ఉపేంద్రవిజయనాటకముయొక్క
## యుత్తరరంగము.

---

ద్వి. శ్రీమనోహరమునెం చియుపేంద్రవిజయ
నామకంబైనయీ నాటకరాజ
మాలకించితిరె మహాజనులార
పోలనీనాటకం బునదేలునట్టి
సారాంశమీభంగిఁ జవియించుఁగాదె
సారనిర్మలకీర్తి సత్యానువర్తి
ధీరగుణస్ఫూర్తి ధృతమహామూర్తి
వైరిగర్వనివర్తి బలిచక్రవర్తి

నతులబలోద్దాము నరిలోకభీము
గతదోషశుభనాముఁ గంటిరిగాదె
వెరయనాతనిసత్య నిష్ఠతనెంచి
తరమాసెపొగడంగ ధాతకునైన 12
ఉన్నతంబైనమ హాహాకారగరిమ
సన్నుతింపఁగనెందు శక్యమేయవని
పాయకబలిమిమైఁ బగదీర్చిచంపు
దాయలందైనను దయచూపియలరె 16
సురరాజ్యమంతయు సురలకునివ్వ
నరుదారమాధవుం డదితిగర్భమున
వామనగతినుద్భ వంబౌటనెఱిఁగె
భామానితంబున్న వైభవంబెల్ల 20
కొంచకరయొలమిమై గోత్రారికివ్వ
వంచింపవచ్చిన వాఁడంచునెఱిఁగె
ప్రాణదానముచేసి నట్టిగురుండు
మానుమన్ననుదాను మానకయతని 24
కోపంబునకునైనఁ గొదుకకవిపుల



శాపంబునకునైన శంకింపకమల
మానసంబునఁదన మాటనిల్కడక
నూనభంగిజనంబు లొగినుతుల్నింప 28
సురకదంబవిహారి సుజనోపకారి
దురితాపహారియు ద్ధురధరోద్ధారి
దానవసంహారి దరచక్రధారి
యైనవామనశౌరి కఖిలంబునిచ్చె 32
ఉరురీతినితనిధీ రోదారగుణము
నరరేయటంచుఁగొం డాడంగఁదగదె
సత్యమార్గంబున సంచరింపంగ
నిత్యపదంబాత నికిసంభవించె 36
సత్యమేధర్మంబు సత్యమేజయము
సత్యమేస్వర్గంబు సత్యమేకీర్తి
నిత్యవ్రతంబుగా నిర్మలబుద్ధి
సత్యంబునడిపిన జాలదేయొందు 40
ధారుణిసకలేష్ట దంబుసత్యంబు
నారకభయనాశ నంబుసత్యంబు

నానాజనానంద నంబుసత్యంబు
గానసత్యముమానఁ గారాడుసుండి 44
మఱియొకమాటనె మ్మదినుంచవలయుఁ
వఱలువదాన్యుఁడీ బలదైత్యనేత
యసురుఁడైయుండియు హరిభక్తికతన
ననమవైఖరిఁగాంచె ననఘమౌపదవి 48
త్రిదివరాజ్యంబెల్ల దేవనాథునకు
నొదవంగఁజేసియు నురుకృపాపరతఁ
దన్నునమ్మినవాఁడు దానవుండౌటఁ
బన్నగశయను ండు భక్తపాలుండు 52
భర్గవంద్యుఁడురమా భామాధవుండు
స్వర్గంబునకుఁబ్రతి స్వర్గంబుగాఁగఁ
బాతాళతలమున బలిదానవేంద్రు
నాతతసమ్మోద మలరారనిలిపె 56
అంతటఁబోవక త్యంతంబుదనదు
స్వాంతంబునిండన చ్ఛపుఁగూర్మి నెఱపి
వనజాసనునకైన వర్ణింపరాని



ఘనయోగులకునైనఁ గణుతింపరాని 60
సురవరాదులకైనఁ జూడంగరాని
పరహరాదులకైనఁ బరికింపరాని
యలఘురూపమునగ దాంచితుఁడగుచు
బలిగుమ్మమున నెకా వలియుండువాఁడు 64
జలజాక్షుఁడెన్నంగ సర్వసముండు
తలపోయ నెక్కువ తక్కువల్లేవు
అతనినమ్మినవభీ ష్టార్థముల్గలుగు
నుతియొనర్చినవేయి నోములఫలము 68
నిస్తులభక్తిని ర్నిద్రతనతనిఁ
బ్రస్తుతిచేయుట పరమభద్రంబు
అరసిచూడంగమ హాజనులార
పరమార్థమొక్కటి పరికింపుడింక 72
మానవజన్మమి మ్మహిదుస్తరంబు
ప్రాణంబుబుద్బుద ప్రాయంబుగాదె
పాయకజరిగెడు ప్రతిప్రతిదినము
నాయువులోఁదక్కు వయ్యెడుఁగాదె 76

కాలంబుస్వల్పంబు కార్యముల్మెండు
ఏలీలసౌఖ్యంబు లెనయంగలేము
అగణితగతిఁబ్రత్యహంబునుమనము
జగతిపైఁబుట్టెడి చచ్చెడివారి 80
నెందఱఁగానమి య్యిలనున్నవారి
నందఱికినిదేహ మతిచంచలంబు
ఎన్నియొన్నకమున్నె మృత్యువుగలుగు
నిన్ననుండినవారు నేఁడుండరైరి 84
నేఁడున్నవారియె న్నికఱేఁపదేమొ
మూడెడుసుఖదుఃఖ ములుచెప్పరావు
ధరణినిజన్మసా ర్థకముగాఁజేయ
నురుతరంబుగఁదర ణోపాయమింత 88
యోచింపకుండుట యఱువౌనెకాల
వైచిత్రిగణుతింపఁ బరమాద్భుతంబు
అందులకధికవ్ర తాదులువలదు
కందిపస్తులఁగుంది కలఁగంగవలదు 92
తెగువమైదేశముల్ దిరుగాడవలదు



పొగిలియోగములందు మునుగంగవలదు
భక్తిమైశ్రీహరి భజనంబుచేయ
ముక్తిసిద్ధించుని మ్ముగనిశ్చయంబు 96
ఆభక్తివలనఁబ్ర హ్లాదుండువెలసె
వైభవంబుననల్ల పరమేష్ఠియొనరె
నామస్మరణచేసి నారదుండలరె
భూమహనీయుఁడై బలిదైత్యుఁడెసఁగఁ 100
గావునమనమెల్లఁ గడుభక్తితోఁ
బావనశుభనాము వైకుంఠధాముఁ
జలజాతదళనేత్రుఁ జారుపవిత్రుఁ
గలుషసంహారుభ క్తమనోవిహారుఁ 104
గమనీయనీలాంగు గరుడశతాంగు
సుమనసామోదుఁబ్ర స్ఫుటవేదపాదుఁ
గరుణాలవాలుశ్రీ కామినీలోలు
వరయోగసంవేద్యు భవరోగవైద్యు 108
నారాయణునిలోక నాయకుహరిని
వారకభజియింప వలయునునుండి.

## EPILOGUE OF CHIRAKARI.

### చిరకారి నాటకముయొక్క యుత్తరరంగము.

ద్వి. శ్రీమహనీయమీ చిరకారియనెడు
నామంబునను బొల్చు నాటకరాజ
మాలకించితిరెమ హాజనులార
పోలనీనాటకం బునదేలునట్టి
సారాంశమింతయె సంగెడుగాదె
కారుణికాఢ్యుఁడుగ్ర తపోధనుండు
అమలమానసమనీ షాంచితోత్తముఁడు
దమశమాధికుఁడుమే ధానిధియొకఁడు
వెలయనయాఢ్యుండు పితృభక్తియుతుఁడు
లలితసద్గుణుఁడుక ళానిధియొకఁడు
వీతమచ్ఛాద్యుండు విటచక్రవర్తి



నూతనమరుఁడుమ నోహరుండొకఁడు
బాలిశుండతులని ర్భాగ్యుండుకలుష
కీలితుండగుశ్వేత కేతుండొకండు
ఉత్తమవంశమ హోన్నతసుగుణ
వృత్తయైతగుచంద్ర రేఖయొకర్తు
భూరిశాంతసమేత పుణ్యవిఖ్యాత
ధీరగుణోపేత తిలకయొకర్తు
ఈహారిఘనవేణి యిగురాకుబోణి
మోహనశుకవాణి మోహినియొర్తు
వీరిచరిత్రంబు వీరివృత్తంబు
గారవంబునమీరు గంటిరిగాదె
అలవారిభంగియిం పలరంగఁజూడ
ఫలితార్థమింతయె ప్పారెడుగాదె
తనరమున్నున్న మేధానిధిగనుఁడు
ఘనకృపాపరుఁడుసం గతభక్తిపరుఁడు
కాయసిద్ధికిఁగాఁగఁ గడఁగిరాజ్యంబు
నాయతమతిఁబాసి యడవికిఁబోయె

అతికలుషాత్ముఁడౌ నతనిసోదరుఁడు
మతిలేనితనమున మానినీమణికి
వినరానియవమాన విధములమిగుల
నొనరించినదిచాల కురుతరకలుష 32
భరముననాతన్వి వరతనూజాతుఁ
గరుణయెంచకహత్యకారులచేతఁ
బట్టించిచెఱనుంచి పాపుఁడైబాలుఁ
గట్టావిధింపనాజ్ఞాపించెగాదె 36
ఒకవత్సరంబుదానుగ్రతపంబు
నకలంకగరిమనిండారంగఁజేసి
యెలమిమేధానిధి యేతెంచెఁబురికి
తెలిసెదోఁబుట్టువు దృఢపాపమెల్ల 40
నట్టులఁదెలిసియు నతఁడేమిచేసెఁ
గట్టిడియనకదు ష్కలుషుండునాక
క్షమియించియాతని కన్నులనిచ్చి
యమరుప్రేమమునరాజ్యంబుననిల్పె 44
శాంతగుణముమేలు జగతిలోనెందు



శాంతితోధారుణి సాటిరాఁగలదె
వంచించితలఁగోయు పరిపంథినైన
మంచిమాటలఁజంపు మాదిరివినరె 48
ఇంతశాంతగుణంబు హితరీతినుండి
కొంతయునరయక గుణమోర్పులేక
ఇదియేమియనకయె క్షాంతయుఁగనక
తుదమొదళ్లరయక తోరమైవచ్చు 52
కోపాగ్నిదహియింపఁ గొడుకునుబంపె
నేపారఁగాఁదన యింతిఁజంపంగఁ
జూచితిరేయెంత సొబగుఘటించె
నీచిత్రభంగియీ హీనకోపంబు 56
నాకన్నులను నేను నమ్మనేయంచు
వేకారితెగఁదీయు విధిఘటియించెఁ
దప్పెనెఱుంగఁడు తనకన్నులైన
నొప్పకనమ్మరాదొకసారియంచు 60
చిరకారితడయుటఁ జెల్లెఁగాకున్న
నరుదేకులక్షయం బగుచుండెననిన

ఒడలెఱుంగనిభంగి నొగిఁగలిగించుఁ
గడయంచుమొదలంచుఁ గనలేమినించు 64
సుతుఁడంచుఁబితయంచుఁ జూడంగలేమి
హితమంచుఁగాదంచు నెఱుఁగంగలేమి
సతియంచునమ్మంచు సంధింపలేమి
బ్రతుకంచుఁజావంచుఁ బరికింపలేమి 68
పాటింపఁగాహెచ్చు పాపంబుఁదెచ్చు
కోపంబదెన్నఁడుఁ గొఱగాదుసుండి
ఈచిరకారిమహిమయిందుఁగనరె
వాచామగోచర వైఖరిగాదె 75
జనకుండుతల్లినిఁ జంపఁదన్పంచె
జననిఁజూడఁగశోక సంయుక్తిముంచె
మెల్లనఁబిత్రాజ్ఞ మీఱరాదాయెఁ
దల్లిఁజంపఁగఁబాప తతిదప్పదాయె 76
ఇట్టిచోధైర్యవిహీనతఁగనక
నెట్టనఁబిత్రాజ్ఞ నెఱవేర్పనెంచె
నమలమానసుఁడితం డైనకతమున



నమితసంతోషమే యలరారెఁదుదకుఁ 80
దల్లిదండ్రులమాట తలఁబూనిసేయ
నెల్లనిసుతుఁడుదా సర్వార్థుండు
శాంతగుణంబునఁ జందంబులరయ
నింతసంతోషమి ట్లితనికిఁగలిగె 84
నేకార్యమైనఁబ రీక్షించియోర్చి
ప్రాకటగతిఁజేయ వలయునుసుండి
ఈమనోహరుఁగంటి రేజనులార
శ్రీమీఱవిహరించి చెలఁగినవాఁడు 88
ఉన్నవేశ్యలయిండ్ల నొగిలెక్కలేని
కన్నెతికంబులఁ గనిమించినాఁడు
మోహినిపట్లనీ మూర్ఖుండుపూర్ణ
సాహసమొనరించె సతిఁగూడనెంచె 92
ఆమోహినీసతి యతులవాఙ్మహిమ
నేమాయెవీనితు చ్ఛేచ్ఛలవెల్ల
ఇరవారఁజెఱుపంగ నెంచినతన్వి
గురువాయెఁదుదకు నీకుటిలచిత్తు 96

వెలయమోహినిబుద్ధి వెలయాండ్రకున్న
నిలలోనవిటరాజు లెందుండువారు
శ్వేతకేతునినింకఁ జెచ్చెరఁగనుఁడు
ఘాతుకబుద్ధి నిల్కఁడగాంచినాఁడు
కనుఁగొనరానిదు ష్కార్యముల్సేసెఁ
గొనకుఁదానందేమిఁ గొనియెఁగనుండి
తనపాపభరమునఁ దానీల్గెఁగాక
మెనయంగనాయొరు లేమైనఁజెడిరె
నిత్యుండనేనన్న నెతినించిపాప
కృత్యంబులొనరింపఁ గూడదుసుండి
చెలులారపల్లవ శ్రీపాణులార
కలవాణులారయో ఘనవేణులార
చంద్రరేఖాసతి చందంబుఁగనరె
సాంద్రపాతివ్రత్య సరణికినెలవు
ఏపాపమెఱుఁగని యీయెలనాగఁ
గోపించిపతిఁజంపఁ గొడుకునుబంప
నొక్కమాటనదునై పోపకపలుక



దక్కటాయనదుకీ డాడదుభయము
జెందదుపతిభక్తి చెదరదుదుఃఖ
మొందదుపోలదే యొనరఁగీర్తింప
సతియైననేమినెం చకమగరూప
మతిశయముగఁగన్న యంగనామణిని
ముద్దులాడినపాప మునకునీశిక్ష
తిద్దయుఁదగునంచుఁ దలపోసిచూచె
నాపతిభక్తియొం డధికమైయుండ
నీపైఁదలికిసౌఖ్య మేపారఁగలిగె
కావునపతిభక్తి కంటెనంగనకు
నేవేళభూషణం బిలలేదుసుండి
ఈతిలకనొకింత వీక్షింపవలదె
యీతన్వినరిసఖు లెందైనఁగలరె
మఱదిచేసినయవ మానమోరువక
తెఱఁగుమాలంగఁగాఁ దిలిచంద్రరేఖ
వెనువెంటఁదగిలిబ ల్విపినంబులనక
వనభూములనక యవారితదుర్గ

సీమలనకపోయెఁ జెలితనంబలర
భామామణియుఁ బెండు వారిబల్మార్భ 132
నాముడుమానంబు లలరఁబోషించె
నేమారకుపచార మేపారఁజేసి
నీడఁజాలనియప్డు నెఱినీడనిచ్చు
వాఁడునిక్కపుమిత్ర వరుఁడగుసుండి 136
ఈమోహినినిఁజూడుఁ డీచెలులార
క్షేమంబుదైవారఁ బెంపుచేకూర
నెలఁతలమేల్బంతి నిక్కమీయింతి
లలనాలలామయీ లావణ్యధామ 140
ఈనాతిచరితంబు హితదాయకంబు
ఈనారిగుణముల కెనగల్గదెందు
పదిదినంబులచిన్ని ప్రాయమునాఁడె
యొదవెను వెలయాలి కొనరనీరమణి 144
వెన్నతోఁగూడంగ వెలయాలినడక
లన్నియుఁబోనెనీ యతివకావేశ్య
పదియునాఱేఁడుల ప్రాయంబుదాఁక



నొదవెనాశిక్షలే యుర్వినీసతికి 148
బుద్ధివచ్చినదినంబులనుండిచెలువ
శుద్ధవర్తనమన్నఁ జూచియెఱుంగ
దలవ్రాకవిద్యల నన్నియుఁ నేర్చె
నలరారసరసవిద్యలఁగూడ నేర్చె 152
ఈరీతినుండియుఁ నీకృత్యమునకు
నారీమతల్లిమనంబొప్పదాయె
ఇదియేమికారణం బిదియేమివిధము
మదిరాక్షులారనె మ్మదినెంచికనుఁడు 156
బహుజన్మగురుతపః పరిపాకఫలము
అహహా! యిదేయందు రదిగాదుసుండి
పుట్టఁగావచ్చిన బుద్ధిపుల్లలను
బెట్టినబోవదు పృథివినల్లొట 160
ఘనవంశమునఁబుట్టు కతననిట్లాయె
ననఁబోదురేమొయ ల్లదిగాదుసుండి
అరయంగనామనో హరునిమోహింప
దరవిందలోచన యటుగానవానిఁ 164

బరికింపదయ్యెను ప్పకపోయెఁదీన
నరుదేమియనియెద రటుగాదునుండి
అదియుఁగాదిదియుఁగా దన్న నెట్లన్న
మదిరాక్షులార నామాటవినుండు 168
హృద్యవిద్యల నేర్పు టిదికారణంబు
విద్యగాకేమింక వేఱుకారణము
స్త్రీలకువిద్య వచ్చినఁజేటుగల్గు
నాలరులగుదురం చజ్ఞులుకొంద 172
అత్యంతమగుభంగి నాడెదరదియు
సత్యంబుగాదది సత్యంబుగాదు
అతికలుషంబువి ద్యలుదెచ్చునసుట
క్షితినమ్మఁబోకుఁడీ చెల్లియలార 176
తన్నెందుసన్మార్గ దాయినియంచు
సన్నుతించుచునుండ సతులఁజేరంగ
హృద్యేతరమటన్న నీమాటవిన్న
విద్యావతియు నెంత విలపించునదియొ 180
ప్రజ్ఞావిశేషమణ భానునిమాని



యజ్ఞానతిమిరంబు నడుగంగవలెనె
శీతాంశుముఖులార చెల్లియలార
ఈతీరుమీమది నెంచిపాటించి 184
యీవిధిమీసుతల్ హితమతినుండఁ
గావలెననిమీరు కాంక్షింతురేని
మీసుతలకునెల్ల విద్యచెప్పింప
వానిఁజెందుదు రిది పథ్యంబునుండి. 188



# THE
# EPILOGUE OF BRUHANNALA.

## బృహన్నల నాటకముయొక్క
## యుత్తరరంగము.

ద్వి. శ్రీరాజితముబుధ చింతితదాయ
కారూఢివెలయుబృహన్నలచరిత
మాలకించితిరెమ హాజనులార
చాలనీపాండవ చరితంబుఁగనుఁడు
అలఘుగుణాధారులైయుండితమకు
నలనందనందనుం డనుఁగుగానుండి
యొకనాఁటిజూదాన నుజ్జ్వలబహుళ
సకలసంపదలను చయ్యనఁబాసి
పదియునురెండేండ్లు వనమునఁబడిరి



అదిగాకయొకవర్ష మజ్ఞాతభంగి
విరటునిఁగొలువ వేషముల్ మాని
గురునీచవృత్తులఁ గొల్వుండిరకట
యీలాగునగజెంది శేమనవలయుఁ
గాలంబుదరియింపఁ గారాదుసుండి
వారేలకారవ్య వరులనుగనుఁడు
వారిచందముఁజూడఁ బరమాద్భుతంబు
పరశురామునిబాహు బలమహోద్దాము
తిరుగంగఁదోలివ ధీరుండొకండు
అరుదుగానస్త్రవిద్యలకుమగండు
గురుతేజుఁడగుధను ర్ధరుఁడొక్కరుండు
అతనికంటెనుశూరుఁ డతిరథశ్రేష్ఠుఁ
డతులవిక్రముఁడుకృపాచార్యుఁడొకఁడు
నిటలాక్షునంశ జన్మించినయట్టి
పటుబలుండాహవ భర్గుండొకండు
తేజంబునను దిక్కు దిక్కులనెల్ల
రాజరాజనుపేరఁ బ్రబలెనొకండు

అతిమించియర్జును ననిఁగూలవైతు
వెఱపేదియనుమేటి విలుకాఁడొకండు
పోటునయముసైన బోరిపుచ్చఁగడఁగు
పోటిరివిలుకాండ్రు పారిఁబెక్కు వేలు
అంతటివారొక్క యర్జునునోర్వ
నెంతయుఁజాలక యిటుక్రిందఁబడిరి
యీలాగయిననింక నేమనవలయుఁ
గాలంబుదరియింపఁ గారాదుసుండి
ఈకీచకునిగంటి రేజనులార
పాకారికైనను బ్రతియగువాఁడు
ఘనబాహుబలధుర్య కంజాప్తశౌర్య
జనదద్రిధైర్యకీచక వర్యయంచు
భూజనంబులుసర్వ భూములఁబొగడ
రాజన్యులరులని రంతరమివ్వ
దారుణంబుగవసుం ధరనేలినాఁడు
వీరశేఖరుఁడంచుఁ బేరొందినాఁడు
భీముఁడొక్కఁడుదక్క బృథివివేఱొక్క



భూమీశుఁడతనితోఁ బోరాడఁగలఁడె
పరసతీమణిభంగ పఱచినపాప
భరమునమతిఁదూలి వరశక్తిసోలి
ప్రాభవగతిమాలి పడియెఁగాకున్న
నాభీముఁడైననే మతనికినెదుర
దుర్మార్గవృత్తిబ ల్దర్పోహమెత్తి
ధర్మనందనురాణి తలిరాకుబోఁణి
నలఘువిలాసహే మాయతనాన
నళికుంతలాళిన త్యధికపాంచాలి
నెటుబాధచేసెనీ హీనకీచకుఁడు
కటకటాతలపోయఁ గారాదుగాదె
తుదకుఁదానేమిసం తోషంబుజెందె
తుదలేనిదుర్బుద్ధి తోఁదానెమందె
ఈబాహుబలధుర్యుఁ డీయస్త్రవీర్యుఁ
డీబలాహకధైర్యుఁ డేమాయెనకట
యీకీచకునిభంగి యేయిట్టులుండ
లోకులనెరులనా లోచింపవలెనె

అపకీర్తియొకటిపా యనిపాపమొకటి
యుపతాపమొక్కటి యురుదుఃఖమొకటి
పరిభవమొకటిప్రా భవహానియొకటి
చిరభీతియొకటిహె చ్చినవైరమొకటి 64
ధనహానియొక్కటి తనహానియొకటి
ఘనభయంకరనర కంబెయందొకటి
అతికామమునరావ ణాసురుఁడీల్గె
క్షితినిందుదలపోయఁ గీచకుఁడీల్గె 68
కావునధరపర కాంతలమీఁది
భావమెన్నఁడుగాని వలవదుసుండి
ఈకీచకాధము నీక్షించుకంటిఁ
బాకారిసుతునింత పరికింపవలదె 72
మాయురేయింతటి మహిమంబుభూమి
నేయెడనైనఁబ్ర తీక్షించినామె
ప్రజ్ఞావిశేషులై భాసిల్లువారు
యజ్ఞయాగాదుల నడరించికాక 76
యేకాంతమైసిరి నీక్షింపలేరొ



భూకాంతులైయుద్ధ భూములఁజేరి
భీతిల్లకనిచేసి పృథ్విపైనీల్గ
కేతన్విసంభోగ మెఱుఁగంగలేరొ 80
అమరనిరాహారు లైతపశ్చర్య
లమితాబ్దములుచేసి యఖిలవృత్తముల
నిత్యసంగముల మానినవారినైన
భృత్యోహమనఁజేసి వెలయంగఁజాలు 84
నేవారికడగంటి నెసఁగువాల్చూపు
దీనుఁడైవేఁటొక్క దిక్కులేదంచు
నడలెదనంచుదా సోహమ్మటంచు
నెడబాయనంచునీ వేదిక్కటంచు 88
నాపురూరవసుఁడ హార్యధైర్యుండు
ఏపంకజానన కిలదాసుఁడయ్యె
ఆమానినీమణి యామోహనాంగి
యాముద్దులాడియా యలరుపూఁబోఁడి 92
ఆయుర్వశీసతి యనదయైతన్నుఁ
బాయకుండినముద్దు పల్కులుదనర

నశరీరసుఖమివ్వఁ జనుదెంచిదేవ
కృశమధ్యనరునిపై కేవలమోహ 96
మతివేలమైనిండ నకటతానెంత
బతిమాలినను బలవంతపెట్టినను
నోజికాదనిత్రోసె నొప్పకపోయె
నీజితేంద్రియతయెం దేనియుఁగలదె 100
అదియేమిమగని యాలాకాదువావి
గదురని వెలయాలు ఘనసురవేశ్య
అట్టియింతినిఁదన యయ్యచేపట్టి
నట్టియింతియటంచు నటుపారఁదోలె 104
చూచితిరేయెంత సొబగుఘటించె
కీచకునికిఁగ్రీడి కినిభేదమరయ
బలుకీచకునిబుద్ధి ప్రజలకుఁగల్గ
నిలనుబతివ్రత లెందుండువారొ 108
పోలనీయర్జును బుద్ధిగల్గంగ
నీలోకమునవేశ్య లెందుండువారొ.

---

## THE EPILOGUE OF

# CHITRA NALEEYA NATAKAM.

## శ్రీచిత్రనళీయ నాటకముయొక్క-
## యుత్తరరంగము.

ద్వి. శ్రీమహనీయంబు చిత్రనళీయ
నామకంబైనయీ నాటకంబునను
ఫలితార్థమరయరే పావనులార
సలలితామలకీర్తి సత్యానువర్తి 4
వైరిగర్వనివర్తి వరచక్రవర్తి
ధీరగుణస్ఫూర్తి దివ్యసన్మూర్తి
విదితబలోద్దాముఁ బృథుశాంతిధాము
వదననిర్జితసోము వరరూపకాము 8
నతనిర్జరారాము నళసార్వభౌము

గతదోషశుభనాముఁ గంటిరిగాదె
సర్వసర్వంసహా చక్రంబు నేలి
యుర్విపైఁ దులలేని యురుశక్తిఁ దేలి
యున్నయీ రాజన్యుఁ డొగిఁ గాలమహిమ
నెన్నక మిత్రుల హితబుద్ధి వినక
మాయజూదంబాడి మహిరాజ్య మోడి
శ్రీయుక్తి విడనాడి చెలిఁ జతఁ గూడి
కాననంబున కేగి ఘనరీతి నీఁగి
మానినీమణిఁ బాసి మహిమంబు వాసి
కాంతరూపము మాసి కడుఁ గడు గాసి
వంతలఁ బడి రోసి బలుపాటు జేసి
దీనభంగికి స్రుక్కి ధృతిపోవఁ బొక్కి
హీనసేవకుఁ జిక్కి యెఱుకపోఁ దక్కి
కుటిలరీతులఁ గుంది గురుబాధ లొంది
కటకటా కందిబల్కాడగండ్లఁ జెంది
సోలి దూలఁడె యంత సుకుమారుఁ డయ్యుఁ
గాలంబుఁ దరియింపఁ గారాదు సుండి



యీనరేశునకిన్ని యిడుమలఁ దెచ్చె
మానని జూదంబు మహిమ యట్లౌటఁ
గొఱగాదు జూదంబు కొఱగాదు కాదు
కఱటి జూదము హానిఁ గలిగించు సుండి
కరభోరులారయో కల్యాణులార
విరిబోణులార సాధ్వీమణులార
కుదురైన యచ్చంపు గుణముల దొంతి
వదననిర్జితపూర్ణ వరశీతకాంతి
మగువల మేల్బంతి మదనుని దంతి
యిగురుపూవుల బంతి యీదమయంతి
యనఘవర్తనముల నగ్గింపవశమె
చనవుమై లోకసంచయముల నెల్ల
సురుచిరంబుగ నేలి సువ్రతమహిమ
నరుదారు దేవేంద్రు నంతటివాఁడు
సరసకేతెంచి యచ్చపుఁ బ్రేమఁ దన్ను
వరియింపుమంచు నెప్పఁగ వేడలేదె
తనమనోనాథుని దనప్రాణవిభుని

ఘనుఁడైననళరాజుఁ గాదనియతని
వరియించె నేయిట్టి వనితలుగలరె
ధరణిరాజ్యంబుజూదంబున నోడి
తనపతిపోవంగఁ దనపుత్త్రివిడి
వెనువెంట నేగదే వెలఁది కానలకు
నా కానఁదనుఁబాసి యవనీశుఁడేగఁ
దాఁకినవగలచేఁ దపియించెఁగాని
యొక్కమాఱైన నా యుర్వీశవంద్యుఁ
దక్కనాడె నెయిట్టి తరుణులుగలరె
కావునఁబతిభక్తి కంటెసాధ్వులకు
భావించిచూడన దైవతమొండుగలదె
పురుషునకిలలోనఁ బొలుపారుభక్తిఁ
దిరముగాఁగొల్చున తీమణియున్న
మానవతీశుద్ధ మణులారతలఁప
వానిభాగ్యముసాటి వచ్చునేయెందు
నీనళరాజన్యుఁ డెటుకుందెతనదు
మానినివేఱొక్క మనుజేశుఁగోరి



పరిణయంబగునన్న వచనంబువినిఁ
బరికింపరే నేఁడు వనజాక్షులార
పటుబుద్ధిరాజ్యంబుఁ బాయుటకోర్చె
నటు కాననములపాలగుటకు నోర్చెఁ
బుత్త్రినైననుమాని పోవంగ నోర్చెఁ
జిత్రబాధలకెల్లఁ జేడ్పడియోర్చె
మానినీమణిఁబాసి మలయంగ నోర్చెఁ
గాననంబునఁబాము కాటునకోర్చె
మతిపోవఁదనరూపు మాయుటకోర్చెఁ
బ్రతికూలనీచసేవలకెల్ల నోర్చె
నవనిసంకటముల కన్నిటికోర్చె
నువిద రెండవపెండ్లి కోర్వలేఁడాయెఁ
గాన నోసతులార ఘనముగాఁబతికి
మానినియేభాగ్య మహిమంబునుండి.



# THE EPILOGUE OF
# THE SVAPNANIRUDDHA NATAKAM.

## స్వప్నానిరుద్ధ నాటకముయొక్క
## యుత్తరరంగము.

ద్వి. జనులారయలరారు స్వప్నానిరుద్ధ
మను నాటకముదీని నాలకించితిరె
తిలకింపనిద్దానఁ దేలెడునట్టి
ఫలితార్థమింతని పలుకంగవచ్చు
హతసర్వగీర్వాణుఁ డతిబాణతూణుఁ
డతులభుజత్రాణుఁ డగుబాణుఁడొకఁడు
అనఘరూపవిశుద్ధుఁ డధికసన్నద్ధుఁ
డనుపమరణసిద్ధుఁ డనిరుద్ధుఁడొకఁడు
జితహిమకరలేఖ శ్రీగుణోల్లేఖ
యతిశయశుభరేఖ యగుచిత్రరేఖ
రుచిరదేహలతాంత రుచిచయానంత



యచలశుద్ధస్వాంత యగునుషాకాంత
ఈనల్వురనుఁగన్న నెసఁగునుగాదె
యీనాటకంబున నీనీతిసరణి
భుజసహస్రమహావి భూతినిండారఁ
త్రిజగంబులనునీఁడు తెలియనిమహిమ
వెలసినయీబాణ బృందారకారి
బలగర్వమునవింత పాటింపలేక
తనునెల్లవేళలఁ దరలనికరుణఁ
దనరఁబోషించిన తరుణాబ్జధరుని
శంకరుభక్తవ శంకరుహరుని
శంకింపకధికమై చనుకావరమున
సమరదానముఁగోరి జలజాక్షుచేతఁ
దలఁగఁడేకావునఁ దనకెంతబలము
గలిగిననెంతటి ఘనశక్తియున్న
నఱ్ఱాడియొవ్వఁడు నాకీఁడటంచు
విఱ్ఱనీఁగుటయెల్ల వెఱ్ఱితనంబు
తన్నుమించినవారు ధరనుందురంచు

నెన్నిచరించుచే హితమగుసుండి
ఈయనిరుద్ధుండు దృఢమానసుండు
మాయచేఁబురిబాసి మఱిశోణపురముఁ
జేరియయ్యెడనుషా సింధురగమన
చారువీక్షణములి చ్చనునాటినంత
మఱచెఁగాఁదనవారి మఱచెవైదర్భి
మఱచెద్వారావతి మఱచెనంతయును
కాంతాకటాక్షముల్ ఘనములై యెవరి
నెంతచేయఁగఁజాల ఇలలోనఁగాన
మరులుగాకెందును మానినీమణులఁ
బరికించితిరుగఁగా వలయునుసుండి
ఈచిత్రరేఖనూ హించికొండాడ
వాచామగోచర వైఖరిగాదె
తనచెలియగునుషా తరళాయతాక్షి
ఘనరీతినెన్నఁడు గాననివానిఁ
దలఁచిచూడనివానిఁ దనరారువానిఁ
గలలోనఁగనినట్టి కాంతునిచిత్ర



సరణివ్రాయించికొం చకనిరూపించి
పరగుధైర్యముబెంచి పటుమాయనించి
పరికించియిరవెంచి పరతెంచిమించి
దొరికించెగాయిట్టి తొయ్యాలిగలదె
బూటకంబులనెల్లఁ బొంగారఁగూర్చి
నీటిపైజాడల నెమకంగనేర్చు
కావునఁబరికింపఁ గామినీమణుల
నావిలమతులంచు నబలలటంచు
నలసాళులంచు విద్యాహీనులంచు
తలఁచిచుల్కనసేయఁ దగదెందుసుండి
అరుదారనీయుషా హంసగామినినిఁ
బరికించితిరిగాదె బహుళలీలలను
అంతఃపురంబున నలపోతుటీఁగ
కంతైనఁజొరరాని యాభంగినుండి
తల్లిదండ్రులటన్నఁ దగుభక్తిగలిగి
చెల్లువర్తనమునఁ జెలఁగియుండియును
గలలోనఁదానెందుఁ గాననివాఁడు

తలఁచియొంచని వాఁడు తగు వేడబమున
నాకస్మికంబుగా నలరినమాత్రఁ
జేకొనితమిమించి చెలికెత్రెంగించి
పలుమాఱుతపియించి బలిమిచాలించి
వెలయంగఁ దెప్పించి వేఱెవ్వరికిని
దెలుపకతలఁపకఁ దెగువమైతనదు
తలిదండ్రులకునైనఁ దగఁజెప్పికొనక
మందిరంబునరెండు మాసముల్భీతిఁ
జెందకదాఁచెఁగాఁ జెప్పఁగానింక
నేమున్నయదిబుద్ధి నెఱుఁగకయెంత
తామసంబునదొట్టి తగులంబుగట్టి
నిరతంబుజాపెట్టి నిర్బంధపెట్టి
దురుసుదండనపెట్టి తూలింపనేమి
తానుమెచ్చినవానిఁ దాఁబొందుఁగాని
మానినివేఱొక్క మానవుఁగొనునె
కాననెన్నఁడుగాని కన్యలమనసు
రానిపెండ్లివివేక రహితంబుసుండి.

THE

# EPILOGUE OF MADANAVILASA.

## మదనవిలాస నాటకముయొక్క

## యుత్తరరంగము.

ద్వి. జంటించియిందాక జరిగినకథను
వింటిరిగదప్పృథి వీజనులార
పరికింపఁగాదీని ఫలితార్థమింక
స్థిరమతితోమీరు తెలియంగవలయు
ఎందైనపరకాంత యిలలోనవార
మందయానయెకాని మగనాలుగాని
అదియెవ్వరేకాని యతిమోహమునను
మదిలోనగామించు మతమెందుఁజనదు
అపకీర్తియటుపాప మటమహాభీతి
యుపమింపరానిమహోపద్రవంబు

ఘనపరితాపంబు గౌరవహాని
ధనహానియోచింపఁ దనహానిలోక
నింగలుసమకూరు నిజముగాసౌఖ్య
ముందించుకంతయు నటలేదులేదు
కావునధరపర కాంతలమీఁది
భావమెన్నఁడుగాని వలవదుసుండి
మఱియొకమాటమీ మదిలోననరసి
యెఱుఁగుడీయిదిచాల హితవచనంబు
నీచకృత్యమటంచు నెమ్మదిఁగనక
సాచివ్యమొనరమీ సరసకేతెంచి
యీలతాంగియెలెస్స యీభామమేలు
పోలఁగాదానినిప్పుడెపోయితెత్తు
దీనినిఁగొనివత్తుఁ దెమ్మంటిరేని
నానేర్పుచూడుఁడీ నయముగామీర
లనిపల్కియిట్టివా క్యములచేమీకు
మనసుపుట్టఁగఁజేసి మరియాదదీసి
ధనమువృథాచేసి తనమదిరోసి



కొనకువంచనసేయు కుంటెనకాని
కలుషనిర్భయుఁడంచుఁ గాలుదూతంచుఁ
దలపోయసరసరాఁ దగనివాఁడంచు
మరఁగిత్రిమ్మరుమహా మాయావియంచుఁ
బరికించితిరుగఁగా వలయునుసుండి.



## THE EPILOGUE OF

# MOOKA CHIKICHCHAKA PRAHASANUM.

## మూకచికిత్సక ప్రహసనంబను

## నాటకముయొక్క యుత్తరరంగము.

ద్వి. పోలఁజూచితిరిగా బుధవరులార
కేళిమైమూకచి కిత్సకంబనెడు
ప్రహసనంబును దీనిఫలితార్థమింత
సహజంబుగాశక్తి చాలమిఁజేసి
యబలాభిదానంబు నారంగఁగాంచి
ప్రబలఁజాలకయుండి పారతంత్ర్యంబు
గలిగిననేమాయె ఘనమోహగరిమ
మెలఁతలుదామెందు మెచ్చినవారి
సాధింపఁగలవారు సత్యమీమాట
క్రోధించుతండ్రియుఁ గొఱవల్కుతల్లి
తగదనునన్నలు దట్టించుచెలులు
పగఁగాంచుబంధువు ల్వలదనునితరు
లెందఱేనియువార లెంచినమతము
నెందుఁద్రిప్పఁగశక్తు లిలఁగారుసుండి
అదిగాకదీనినిం తారయవలయు
మదిరాక్షిదానునె మ్మదిఁగోరినట్టి
చెలువుఁడబ్బకయున్నఁ జేడ్వడుమిగులఁ
బలితంపురోగము ల్వాటిల్లునప్పు
డారోగములమాన్ప నశ్వినులైన
నేరరుతలపోయ నిక్కమీపలుకు
మఱిమనోవ్యాధికి మందులేదనెడు
తెఱఁగుదానిలలోనఁ దీపించుఁగాదె
బడలునారోగికి వైద్యుండొకండె
మడువంగదానిమ నోవల్లభుండు
అరయంగనందున కౌషధమొకటి
పరగంగనొప్పెడు పరిణయరసము

అటుగాననీధర నరసిచూడంగ
దిటమైనహితముప దేశింపఁబడదె
యిలగుమార్తెలకింక నెనయంగఁబెండ్లి
వెలయించుబుద్ధి దావిలసిల్లెనేని
వారలచిత్తంబు వడయకమున్న
నేరీతియునుజూడ కేమియుఁగనక
ధనకాంక్షచేవారిఁ దగులంగఁగట్టి
ఘనముసంతాపంబు గాంతురుసుండి.






సీ. శ్రీ ధర్మవర రామకృష్ణ సత్కవివర్యుఁ
డంచితగతి రచియించినట్టి
తగురీతి జనులకు ధర్మబోధకములై
యనఘ సన్నీతిదాయకము లగుచు
నవ్యధీప్రదము లౌ నాటకంబుల నున్న
యతులిత బహు ఫలస్తుతుల వెల్ల
బాల బాలికలకుఁ బాఠకులకుఁజాల
నుపయోగకరములై యుండుకతన
వానిమెయిఁజేర్చి ముద్రింపఁబడియె నిందు
వీనిఁ జదివిన జనులెల్ల విపులనీతిఁ
బరఁగుదురుగాత యీగ్రంథపఙ్క్తియుర్వి
నాప్రభాకరతారమై యడరుఁగాత.

